# దేవుని నివాసము మనుష్యులలో ఉన్నదా?

మానవ ఆకారము పంచ భూతములలో నుండి తీయబడిన ఒక అపూర్వమైన రూపం. ఎన్నెన్నో సాధించిన లోకం, మానవ ఆకార నిర్మాణ రూపకల్పనను సాధించలేక చేతులెత్తింది. ప్రకృతి నుండి సకల శాస్త్రాలను నేర్చుకున్న నరుడు, తన శరీరాన్ని గూర్చి ఏమాత్రం నేర్చుకొనని అమాయకుడిగా ఉండిపోయాడు. ఆత్మకథలుగా, ఎన్నెన్నో గ్రంథాలు వ్రాయబడి, అందు వారి వారి శరీరాలు అనుభవించిన అనేక సంఘటనలు సందర్భాలు, వ్రాసుకున్నారే తప్ప అటు ఆత్మను గూర్చిగాని, ఇటు శరీరాన్ని గూర్చిగాని, ఏవిధమైన రహస్యాలను వెలికి తీయలేకపోయారు. శరీరం **'అనుభవించిన జీవితానికి ఆత్మకథ'** అని నామకరణం చేయడం హాస్యాస్పదం. ఏలయనగా ఆత్మ శరీరము కలయికే మానవుడు. మానవునిలో పై రెండు శక్తులు ఒకదానికొకటి పెనవేసుకొని ఉన్నవి. శరీరానికి రోగం సంక్రమిస్తే డాక్టరును సంప్రదించడం ఆనవాయితీ. రోగి తన రోగాన్ని బట్టి డాక్టరుతో నా కన్ను బాగోలేదనో, నా ముక్కు బాగోలేదనో, నా గుండె బాగోలేదనో, కడకు నా శరీరము బాగోలేదనో చెప్పుట వినగలము. పై మాటలను బట్టి నేను, నా శరీరము అను రెండు పదములు వినబడుచున్నవి. అందును బట్టి ఒకటి ఆత్మగాను, మరొకటి శరీరముగాను, మానవుడు రెండు బాగములుగా కనబడుచున్నాడు.

బైబిల్ పరిశీలిస్తే **- ఆత్మ సిద్ధమేగాని శరీరం బలహీనం (మత్తయి 26:41) ఆత్మయే జీవింపచేయుచున్నది. శరీరము కేవలం నిష్ప్రయోజనము (యోహాను 6:63)** అను వాక్యములను బట్టి రెండు మహాశక్తుల కలయికతో దేవుని కుమారుడైన మానవుడు నిర్మితమైనాడని అర్థం అగుచున్నది. ఆత్మ అనంతుడైన దేవుని నుండి, మహాలోకము నుండి వచ్చినదని శరీరము మంటి నుండి అనగా భూమి నుండి తీయబడినదని తెలుసుకొనవచ్చును. **- మన్నయినది వెనుకటి వలెనే మరలా భూమికి చేరును. ఆత్మ దానిని దయచేసిన దేవుని వద్దకు మరలిపోవును.** (ప్రసంగి 12:7) **సమస్తము మంటిలో నుండి పుట్టెను. సమస్తము మంటికే తిరిగి పోవును.** (ప్రసంగి 3:20) **నేల నుండి తీయబడితివి, నీవు మన్నే గనుక తిరగి మన్నైపోవుదువు (ఆది.కా. 3:19) నరులు మరలా ధూళియైపోవుదురు (యోబు 34:15).** వ్రాయబడిన దేవుని మాటలను బట్టి మంటి నుండి వచ్చినది తిరిగి మంటిలోనికి, దేవుని నుండి వచ్చినది తిరిగి ఆయన వద్దకు చేరుచున్నది. విశ్వాసానికి వచ్చిన అసంఖ్యాకమన ఆత్మలు, పైలోకములో నున్న దేవునిలో నుండి వచ్చి భూమి మీద శరీరాలను ధరించుకొని జీవించిన పిమ్మట, కొంత కాలానికి మన్ను మన్నుగాను, ఆత్మ దేవుని చెంతకు చేరిపోవుచున్నవి. - ప్రభువా, తరతరములనుండి మాకు నివాస స్థలము నీవే, నీవు మనుష్యులను మంటికి మార్చుచున్నావు. నరులారా, తిరిగి రండని సెలవిచ్చుచున్నావు (కీర్తన **90:1,3**). నరుడు మంటికి మంటిగాను, ఆత్మకు ఆత్మగాను ఎందుకు విడిపోవాలి? ఒకనాడు దేవుని ఆత్మనే నివాసస్థలముగా కలిగిన విశ్వమానవులలోని ఆత్మలు, భూమి మీద మంటి శరీరములను ఎందుకు ధరించాలి? కొంతకాలముండి, తిరిగి మంటిలో కలిసిపోయే మనుష్యుల శరీరాల అవసరత వాటిని ధరించిన ఆత్మలకున్నదా ? లేక అట్టి ఆత్మలకు ఉనికిపట్టయిన దేవునికి వాటి అవసరత ఉన్నదా ? పై విషయాలలోని పరమార్థము మనకు అర్థం కావాలంటే నేల నుండి తీయబడిన శరీరపు చరిత్ర మనము తెలుసుకొనవలసిందే. నేటి మన సమాజములో భర్తను పోగొట్టుకొని ఏ స్త్రీతో నైనా మీవారెక్కడ? అని ప్రశ్నించినప్పుడు ఆమె వారు పోయి కొన్ని సంవత్సరాలయినదని చెప్పుట మనకు తెలిసినదే. శవాన్ని పెట్టెలో పెట్టి పూలతోను, అత్తరుతోను సిద్ధము చేసినపుడు దానిని కడసారిగా చూచుటకు బంధువులు, స్నేహితులు వచ్చుట ఆనవాయితీ. శవాన్ని చూచుటకు వచ్చినవారంతా ఒకరితో ఒకరు - ఆయన మనకిక లేరని చెప్పుకొనుచుందురు. వారి మాటల్లోని అర్థాన్ని ఆలోచిస్తే వెళ్ళిపోయిన ఆత్మయే అసలుసిలసలైన పేరున్న శక్తిమంతుడని, విడువబడినది, కేవలం నిష్ప్రయోజనమైన శవంగా మారినది శరీరం అని తెలుసుకొనగలము. ఉదాహరణకు చనిపోయినది ఇందిరాగాంధీ అయితే, ఆమె శవాన్ని చూచిన వారంతా మనకిక లేదని, ఉన్న శవం ఆమె వెళ్ళిపోయిన తరువాత ఆత్మ ఉన్న శరీరంగా కాక, ఆమె లేని శవంగా మారి, సభ్య ప్రపంచానికి అది నిష్ప్రయోజనమని పంచభూతములలో విలీనం చేస్తారు. యేసు మాటలను, ఇక్కడ గుర్తుచేసుకుంటే ఆత్మయే జీవింపచేయుచున్నది. శరీరము కేవలము నిష్ప్రయోజనము అని అనిపించుచున్నది. ఇట్టి నిష్ప్రయోజనమైన శరీర ఆకృతికి శిల్పి అయిన దేవుడు, దానిని ఎందుకు సృజించినట్లు? తెలుసుకుంటూ ముందుకు సాగుదాము.

**ఆది యందు దేవుడు భూమ్యాకాశములను సృజించెను (ఆది.కా. 1:1)** బైబిల్‌లోని ప్రారంభ వచనము బట్టి సృష్టి పుట్టి ఎంతకాలమైనది ప్రస్తుతం మనము ఖచ్చితముగా చెప్పలేము. కనుక ప్రస్తుతము శాస్త్రమందున్న అంచనా లెక్కలను బట్టి ముందుకు సాగుదాము. బిగ్ బ్యాంగ్ థియరీ - జగత్తు పుట్ట 1800 కోట్ల సంవత్సరములయిందని అంచాన వేసింది. కాసేపు శాస్త్రపరమైన ఈ అంచనాలను దాటుకుంటూ కొంత అవగాహన కలిగియుండాలని పాఠకులను కోరుచున్నాను. సృష్టి అవిర్భావానికి ముందు అనగా శాస్త్రపు అంచనాల ప్రకారము 1800 కోట్ల సంవత్సరాలకు **పూర్వమే సృష్టికర్తయైన దేవునికి, అనేకులైన పిల్లలు కావలెనను వింత కోరిక కలిగినదని ఈ వాక్యము చెప్పుచున్నది. యేసుక్రీస్తు ద్వారా తనకు కుమారులనుగా స్వీకరించుటకై మనలను ముందుగా, అనగా జగత్తు పునాది వేయబడకమునుపే తన కోసం నిర్ణయించుకొనెను. (ఎఫెసి 1:4-6)**. తన చిత్త ప్రకారమైన అనాది సంకల్పము మేరకు కాలం గడిచిన తరువాత ఆదికాండము 1వ అధ్యాయంలో వ్రాయబడినట్లు మానవ శరీరానికి అవసరమగు పంచభూతములను కలుగజేసి, అందు చివరగా మానవుని సృజించినట్లు వ్రాయబడినది. పాపాయి పుట్టకముందే, అనగా బిడ్డ తల్లి గర్భములో ఉన్నపుడే వారికి అవసరమైన అన్నింటినీ తల్లిదండ్రులు ఎలాగ సమకూర్చుదురో, అలాగే దేవుని కుమారులు మంటి శరీరములను ధరించుకొనకముందే ఆ శరీరములకు అవసమగు వాటినన్నింటినీ ప్రకృతిలో వారికి ముందుగా సిద్ధపరిచెను. భూమి మీద మనము శరీరాన్ని ధరించుకొనుట అనగా తల్లి గర్భములో దానిని పొందుట అని అర్థమగుచున్నది. శరీరాన్ని మానవుడు తల్లి గర్భము నుండి నేడు పొందినా, ఆ విధంగా పుట్టిన నీవు జగత్తు పుట్టకముందే అనగా 1800 కోట్ల సంవత్సరములకు పూర్వమే దేవుని అనాది సంకల్పములో ఉన్నవాడవని అది ఆలోచింపచేయుచున్నది. భూమి మీద మనిషి బ్రతుకు కాలం కేవలం 60, 70 సం॥లే అయినా అట్టి బ్రతుకును నిర్దేశించి దేవుని వ్యూహము 1800 కోట్ల సం॥ల పూర్వపుదేనని గ్రహించవచ్చు. జగత్తు పుట్టకముందు దేవుడు నిన్ను కావాలనుకున్నాడు. కనుక, దానిని పుట్టంచిన మరి కొంతకాలానికి నీ దేవుడు నిన్ను నీ తల్లి గర్భము ద్వారా భూమి మీదకు శరీరముతో నిన్ను రప్పించాడనుట నగ్న సత్యము. ఇక బైబిలు చదవండి - **"నేను భూమికి పునాదులు వేసినపుడు నీవెక్కడ ఉంటివి? నీకు వివేకము కలిగియున్న ఎడల చెప్పుము. దానిమీద పరిమాణపు కొలత వేసినవాడెవడో చెప్పుము? ఉదయ నక్షత్రములు ఏకముగా కూడి పాడినప్పుడు, దేవదూతలందరునూ ఆనందించి జయధ్వనులు చేసినప్పుడు దాని మూలరాతిని వేసిన వాడెవడు; ఇదంతయూ నీకు తెలిసియేయున్నది కదా? నీవు బహువృద్ధుడవు. నీవు అప్పటికి పుట్టియుంటివి" (యోబు 38:4-7,21)**.

పై అంశములను పరిశీలిస్తే దేవుని యొక్క వింత కోరికలో - మానవుల శరీరాల అవసరత దేవునికే ఉన్నట్లు సూచన ప్రాయంగా ఇక్కడ తెలియుచున్నది. నేటి మానవ శరీరాల అవసరత ఆత్మలుగా ఉన్న మనకు కాక, దేవునికే పరిమితమని తెలిసికొనవచ్చు. ఏలయనగా - **మీ దేహము దేవుని వలన మీకు అనుగ్రహింపబడి మీలో ఉన్న దేవుడైన ఆత్మకు ఆలయమై ఉన్నదని మీరెరుగరా? మీరు మీ సొత్తుకారు. విలువపెట్టి కొనబడినవారు కనుక మీ శరీరముతో దేవుని మహిమపరుచుడి (1 కొరింథీ 6:19-20)** మనకు అమర్చబడిన శరీరాలు మనవి కావని, వాటిని తనకు ఆలయంగా మలుచుకున్నాడని అందు ఆయన ఆరాధనలు జరుపవలెని నిర్ణయింపబడినట్లు వాక్యము ఆజ్ఞాపించుచున్నది. గత కాలము భూమి మీద నుండిన కొందరు చక్రవర్తులు, దేవునికి ఆలయం కట్టాలనుకున్నప్పుడు దేవుడు వారితో -**" ఆకాశము నా సింహాసనము, భూమి నా పాదపీఠము, మీరు నా కొరకు ఎలాంటి మందిరము కట్టుదురు? నా విశ్రాంతి స్థలమేది? ఇవన్నియు నా హస్తకృత్యములు కావా? అని చెపుతూ సర్వోన్నతుడైన తండ్రి మనుష్యుని హస్తముతో కట్టబడిన జీవములేని ఆలయములో నివసింపనేరడని చెప్పుచున్నాడు" (అపో.కా. 7:47-59)**. భాష, జ్ఞానము, కదలిక లేని నిర్జీవపు కట్టడములు తనకు ఆలయములు కావని, తన ఆలయాన్ని తానే కట్టుకోవాలని నిర్ణయించుకొని, భాష, జ్ఞానము, తెలివి, వివేచన కలిగి చలించే తన నివాసాన్ని తన చేజేతులా నేలనుండి నిర్మించినదే మానవ ఆకారమైన ఈ మంటి శరీరము. **దేవుడైన యెహోవా నేలమంటితో నరుని నిర్మించి వాని నాసికారంధ్రములలో జీవవాయువును ఊదగా నరుడు జీవాత్మ ఆయెను. (ఆది.కా. 2:7) నా అంతరింద్రియములను నీవే కలుగజేసితివి. నా తల్లి గర్భమందు నన్ను నిర్మించినవాడవు నీవే, నీవు నన్ను కలుగచేసిన విధము చూడగా భయమును, ఆశ్చర్యమును నాకు పుట్టుచున్నవి. నేను రహస్యమందు పుట్టిననాడు, భూమి యొక్క అగాధ స్థలములలో విచిత్రముగా నిర్మింపబడి ఉంటిని (కీర్తన 139:13-15)**.

మానవ శరీరమునకు అవసరమగు మట్టి, భూమి పైభాగము నుండి తీసినది కాదని, అగాథ స్థలము నుండి తీయబడిన మట్టియని ఇక్కడ కనబడుచున్నది. మానవ ఆకారమునకు అవసరమగు మట్టి భూమియొక్క అగాథ స్థలములలోనిదని, దేవుని హస్తములతో తీయబడిదని గ్రహింపగలము. భూమి ఉపరితలమునకు, భూమి యొక్క అగాథ స్థలమునకు మధ్య, ఎంత భయంకర స్థితి ఉన్నదో ఈ సందర్భముగా మనము తెలుసుకొనవలసి ఉన్నది. భూమి ఉపరితమున సగటు ఉష్ణోగ్రత లేక వేడిమి $68^0C$ ఉండును. అయితే భూమిని త్రవ్వకుంటూ లోపలి భాగాలకు పోతుంటే ప్రతి వెయ్యి అడుగులకు $16^0C$ ఉష్ణోగ్రత పెరుగుతుంది. ఈ విధంగా ఒకటిన్నర మైళ్ళు లోతుకుపోతుంటే నీళ్ళు మరిగిపోయేంతటి వేడిమి ఉండును. ఇంకా త్రవ్వకుంటూ 30 మైళ్ళ లోతుకు పోతే అక్కడ ఉష్ణోగ్రత $2200^0C$ నుండి $3300^0C$ ఉంటుంది. అంటే శిలలు కరిగి, అగ్ని పర్వతాలుగా పగిలి, లోతుల నుండి పైకి లావా విరజిమ్ముతుంటుంది. భూమిలో 30 మైళ్ళ లోతుకు పోతేనే ఇంతటి భయంకర స్థితి ఉంటే ఇక భూమి అగాథ స్థలములలోని సంగతి మీకు చెప్పనవసరము లేదు. **అదే భూమిలో నుండి ఆహారము పుట్టినను దానిలోపటి భాగమంతయూ అగ్ని మయమైనట్లుండును (యోబు 28:5).** అంతటి భయంకర అగాథ స్థలాల నుండి మానవ శరీరమునకు అవసరమగు సారవంతమైన జిగట మంటిని, ఆయన హస్తములతో తీసి చక్కని రూపముతో మలిచాడు. నీ హస్తములు నాకు అవయవ నిర్మాణము చేసి, నన్ను రూపించెను. జిగట మన్నుగా నన్ను నీవు నిర్మించితివి. ఒకడు పాలుపోసినట్లు నీవు నన్ను పోసితివి గదా, జున్ను గడ్డ ఒకడు పేరబెట్టినట్లు నీవు నన్ను పేరపెట్టితివి గదా, చర్మముతోను, మాంసముతోను, నీవు నన్ను కప్పితివి, ఎముకలతోను, నరములతోను నన్ను నిర్మించితివి (యోబు 10:8-11).

సృష్టిలో మొదటి మానవ ఆకారాన్ని దేవుడు తన స్వహస్తాలతో తనకిష్టమైనట్లుగా మలచియున్నాడు శరీరములోని ప్రతి అవయవము తన చిత్తానికి అనుకూలంగా చేసియున్నాడు. మావన ఆకారములోని ప్రతి అణువు ఆయనకు అనుగుణంగా నిర్మితమైనదని చెప్పవచ్చును. మనము నివసించుటకు గృహాన్ని కట్టదలచినపుడు వరండా, గెస్ట్‌రూమ్, బెడ్‌రూమ్, డైనింగ్,కిచెన్, టాయిలెట్స్ డోర్స్ విండోస్ మరియు వెంటిలేటర్స్ మనకిష్టం వచ్చునట్లు ఏవి, ఎక్కడ, ఎలాగు సిద్ధపరచు కుంటామో అలాగే దేవుడు తన నివాసమైన మానవ శరీరాన్ని తనకనుకూలంగా కట్టుకోవడంలో ఆయనకెంత అవసరం ఉన్నదో తెలుసుకొనవచ్చును. - **దేవుడు ముందుగా సిద్ధపరచిన సత్క్రియలు మనము చేయుటకై క్రీస్తు యేసు నందు సృష్టింపబడిన వారమై ఆయన చేసిన పనియై ఉన్నాము. (ఎఫెసి 2:10) సమాధాన కర్తయగు తండ్రియైన దేవుడు కుమారుడైన యేసు క్రీస్తుద్వారా తన దృష్టి కనుకూలమైన దానిని మనలో జరిగించుచూ, ప్రతి మనిషి విషయములోను తన చిత్తప్రకారము చేయుటకు మిమ్మును సిద్ధపరచును (హెబ్రీ 13:21) దావీదు నా ఇష్టానుసారుడైన మనుష్యుడు. అతడు నా ఉద్దేశ్యములన్నియూ నెరవేర్చునని చెప్పి దేవుడతనిని గూర్చి సాక్ష్యమిచ్చెను. అందువలన దావీదు దేవుని అనాది సంకల్పము చొప్పున తన తరము వారికి సేవ చేసి మరణించెను. (అపో.కా. 13:22,36)** పై వాక్యములను పరిశీలిస్తే వందల కోట్ల సంవత్సరములకు పూర్వమే అనగా జగత్తు జనించకముందే తండ్రియైన దేవుడు తన కుమారులను నిర్ణయించుకున్నాడని, ఆ విధముగా నిర్ణయింపబడిన వారు జగత్తు పుట్టిన తరువాత ఆయా కాలములలో, ఆయా ప్రాంతములలో భూమి మీద పుట్టి, దేవుడు నిర్ణయించిన కార్యక్రమములు పూర్తి చేసుకొని శరీరాన్ని వదలి తండ్రి వద్దకు పోవలెను. - **దేవుడు ఎవరిని ముందుగా ఎరిగెనో వారు తన కుమారునితో సారూప్యము గలవారగుటకు వారిని జగత్తు పునాది వేయబడక ముందే నిర్ణయించెను. మరియు ఎవరిని ముందుగా నిర్ణయించెనో వారిని పిలిచెను. ఎవరిని పిలచెనో వారిని నీతిమంతులుగా తీర్చెను. ఎవరిని నీతిమంతులుగా తీర్చెనో వారిని మహిమపరిచెను (రోమా 8:29,30)** దేవుని సంకల్పము చొప్పున ఒకడు బలపరాక్రమవంతుడైన చక్రవర్తి దావీదుగాను, మరియొకడు మహాజ్ఞాన సంపూర్ణుడైన రాజైన సొలొమోనుగాను. వేరొకడు బలవంతుడై సమ్సోనుగాను, ఇంకొకరు అపోస్తలుడైన పేతురుగాను, పౌలుగాను, స్తెఫనుగాను, నీవుగాని, నేనుగాని భూలోకమందు కారణజన్ములమై యేసుక్రీస్తు వలె పరలోకమందున్న తండ్రియొక్క అభీష్టాన్ని నెరవేర్చుటకై పుట్టియున్నాము. **యేసు ఈ లోకమందు పుట్టినపుడు ఈలాగు చెప్పుచున్నాడు. బలియు, అర్పణము నీవు కోరలేదుగాని నాకొక శరీరమును అమర్చితివి దానికొరకు నీ గ్రంథపు చుట్టలో వ్రాయబడిన ప్రకారము దేవా నీ చిత్తము నెరవేర్చుటకు ఇదిగో నేను వచ్చియున్నాను (హెబ్రీ 10:5-7).** శరీరధారియై తండ్రి చిత్తాన్ని నెరవేర్చుటకు ఆయత్తమవుతున్న వేళ

పరలోకమందు దేవుడు **ఇదిగో ఈయనే నా ప్రియకుమారుడు, ఆయన యందు నేనానందించుచున్నానని చెప్పెను (మత్తయి 3 : 17).** యేసుక్రీస్తు ద్వారా జగత్తు పునాది వేయబడకముందే నిర్ణయింపబడిన మనమంతా దేవుడు ధరింపజేసిన లేక అమర్చిన శరీరాలతో బ్రతుకు కాలమంతా ఆయన మనకప్పగించిన పనులన్నీ పూర్తి చేసి దానిని విడిచి ఆయన ఉన్న మహాలోకానికి ఎగసిపోవాలి.

**నేను పిండమునైయుండగా నీ కన్నులు నన్ను చూచెను. నియమింపబడిన దినములలో ఒకటైనను కాకమునుపే నా బ్రతుకు దినములన్నియూ నీ గ్రంథపు చుట్టలో లిఖితములాయెను (కీర్తన 139:16).** అనాది సంకల్పములోని మనము భూమి మీద కొచ్చు తరుణాన తల్లి గర్భమున పిండముగా వున్నపుడే మన ఆయుష్షుకాలాన్ని దేవుడు తన గ్రంథములో లిఖించుకొనెను. జీవిత కాలానికి ప్రారంభ దినాన్ని జన్మదినమని, చివరి దినాన్ని మరణదినమని పిలచుట మనకెరుకే. జనన, మరణ దినముల మధ్య కాలాన్ని దేవుడు తన గ్రంథములో లిఖించుటలో గల పరమార్ధమును కొంచెము ఆలోచించాలి. ఎందుకనగా, ముందుగా సిద్ధపరచిన ఆయన పనులు చేయుటకై మనము వందల, కోట్ల సంవత్సరములకు పూర్వమే అనగా ఆయన సంకల్పములో నిర్ణయింపబడినవారము. వీటన్నింటినీ బట్టి మనము చేయవలసిన ఆయన క్రియలను బట్టి అవి పూర్తగుటకు అవసరమైన ఆయుష్షుకాలాన్ని నిర్ణయించి వాటన్నింటినీ దేవుడు తన గ్రంథములో లిఖించుకొనెనని బైబిల్ చెప్పుచున్నది. భూమి మీద మన రాకతో తన పనులను జరిపించుకొను ఆశతో కలలుకన్న తండ్రి, పిండమై తల్లి గర్భములో ఉన్నపుడే దేవుని కన్నులు మనలను చూచుచున్నవని వ్రాయబడెను. - **కాబట్టి శరీర దురాశలకు లోబడునట్లుగా చావునకు లోనయిన మీ శరీరమందు పాపమును ఏలనీయక, శరీర అవయవములను దుర్నీతి సాదనములుగా పాపమునకు అప్పగింపక, మిమ్మును మీరే దేవునికి అప్పగించుకొనుడి. మీ అవయవములను నీతి సాధనములుగా దేవునికి అప్పగింపుడి (రోమా 6:12,13) అందువలన సహోదరులారా!** పరిశుద్ధమును, **దేవునికి అనుకూలమైన మీ** శరీరములను దేవునికి సమర్పించుకొనుడని దేవుని వాత్సల్యమును బట్టి బ్రతిమాలుకొనుచున్నాను. **ఇట్టి** సేవ మీకు **యుక్తమైనది. మీరు ఈ లోకమర్యాదను అనుసరింప ఉత్తమమును, అనుకూలమును, సంపూర్ణమైయున్న దేవుని చిత్తము పరీక్షించి తెలుసుకొనునట్లు ఇప్పటికైనను మీ మనస్సు మారి నూతనమగుటవలన రూపాంతరము పొందుడి (రోమా 12:1,2).** దేవుడు ఆశించినట్లుగా ఆయన కనుకూలంగా మన బ్రతుకులను పండించాలని తల్లి గర్భములోని పిండము దశ నుండి మనకు **అవయవ నిర్మాణము జరిగించుచున్నప్పుడే శరీరములోని అవయవములన్నింటినీ గూర్చి తన గ్రంథములో దేవుడు వ్రాసుకున్నాడని (కీర్తన 139:16)** వచనమునకు మూల భాషలో వ్రాయబడి ఉన్నది. నడినెత్తి నుండి అరికాలివరకూ శరీరములోని ప్రతీ అణువుపైన దేవుడు ఎంత బాధ్యత కలిగియున్నాడో గ్రహించుకొనవచ్చు. **నీ తల వెంట్రుకలన్నియూ లెక్కింపబడియున్నవి (లూకా 12:7).** రాలి ఊడిపోతున్న మన వెంట్రుకలపై మనకే లెక్క లేనప్పుడు, ప్రతీ వెంట్రుకను ఆయన లెక్కించి గ్రంథమునందు లిఖించాడంటే ఎంత ఆశ్చర్యము ! అపూర్వమైన మానవ శరీరాన్ని మనిషి పట్టించుకొనక, దానిని చేతితో చేయబడిన ఈ అపూర్వ రూపాన్ని మనిషి స్వార్థ ప్రయోజనాలకే వినియోగించుకుంటూ, అందులోనికి దేవునిని రానీయక పాపపు ప్రపంచపు భ్రమలో మునిగి తేలుతున్నాడు. అయితే ప్రేమామృతుడైన దేవుడు - **"తలుపునొద్ద నిలుచుని తట్టుచున్నాను, ఎవడైనను నా స్వరము విని, తలుపు తీసిన యెడల నేనతని లోనికి ప్రవేశించుదునని చెప్పుచున్నాడు" (ప్రకటన 3:20).** ఓ మనిషి, నీ శరీరాన్ని తెరచి దానిని దేవునికి ఆలయంగా మలుస్తావో, లేక దొంగల గుహగా కొనసాగిస్తావో నిర్ణయం నీపైనే ఆధారపడి ఉంది.

మామిడి పండ్ల కాలమునకు ముందు మామిడి వృక్షములన్నియూ పూత ప్రారంభిస్తాయి. ఒక్కొక్క చెట్టును పరీక్షిస్తే ప్రతీ వృక్షానికి సుమారు కోట్ల సంఖ్యలో మామిడి పువ్వు ఉంటుంది. అయితే చెట్టుకున్న పువ్వు అంతా రోగముల వలనను, వాతావరణములలోని మార్పుల వలనను, అసంఖ్యాకంగా నేల రాలిపోతుంది. కోట్ల సంఖ్యలో పూసిన పువ్వు నేలరాలిపోగా కేవలం వేల సంఖ్యలో పువ్వు మాత్రమే పిందెలుగా మారుతుంది. ఆ చెట్టుకు నిలచిన ఆ పిందెలు కూడా జంతువులు, రోగములు, వాతావరణ మార్పులు మున్నగు వాటివలన వేల సంఖ్యలో పిందెలు నేలరాలిపోతాయి. కడకు వందల సంఖ్యలలోనే కాయలు పండ్లుగా మారుట జరుగుతుంది. మనం ఇక్కడ ఒక విషయాన్ని తప్పక ఆలోచింపవలసియుంది. మామిడి చెట్టుకు పూసిన కోట్ల సంఖ్యలోని పువ్వంతా నేలరాలిపోగా, వందల సంఖ్యలో పువ్వు

ఫలించి పండ్లుగా మారుతున్నాయి. ఇదొక వృక్ష శాస్త్రము. ఇక మానవ ఆకార నిర్మాణ శాస్త్రాన్ని ఆలోచిస్తే - వివాహము చేసుకున్న ప్రతి దంపతులు కలయికలో పురుషుని నుండి వేలకు వేలుగా జీవకణములు స్త్రీ మూర్తిలోనికి ప్రవేశిస్తాయి. వాటిలో ఏదో ఒకటి స్త్రీ కణముతో కలిసినపుడే కంటికి కనబడనంత సూక్ష్మదశలో పిండము ప్రారంభమౌతుతంది. అనగా ఈ భూమి మీదకు రావడానికి తల్లి గర్భములో ఒక మానవ ఆకారం తయారగుటకు సిద్ధమయ్యింది. ఒకవేళ వేలకువేలుగా వెలువడిన పురుష కణాలలోని ఏ ఒక్కటీ స్త్రీ కణముతో కలవకపోతే మొదటి కలయిక నిష్ప్రయోజనమౌతుంది. ఆ విధంగా ఆలోచిస్తూంటే తల్లి గర్భములో పిండమగుటకు ముందు కోట్ల కణాలు నిర్వీర్యమై నేల రాలిపోతున్నాయి. సంవత్సరాలు తమ దాంపత్య జీవితంలో గడచినా, మాతృమూర్తులు కాని ఎందరో స్త్రీలు నేడు మనముందున్నారు. **అందుకే నా అంతరింద్రియములను నీవు కలుగజేసితివి నా తల్లి గర్భమందు నన్ను నిర్మించిన వాడవు నీవే. నన్ను కలుగజేసిన విధము చూడగా భయమును ఆశ్చర్యమును పుట్టుచున్నదని దావీదు భక్తుడు చెప్పుచున్నాడు. అదేవిధంగా కుమారులు యెహోవా స్వాస్థ్యమనియు, గర్భఫలము దేవుడిచ్చు బహుమానమే అనియు (కీర్తన 127:3).** లో దేవుడు చెప్పుచున్నాడు. అనాది దేవుని సంకల్పము మేరకు వందల కోట్ల సంవత్సరములకు పూర్వమే, నీవు కావాలని ఆయన గ్రంథపు చుట్టలో వ్రాయబడితేనే గాని నేడు నీ తల్లి గర్భమందు నీవు నిలద్రొక్కుకొనలేవని రూఢి అగుచున్నది. తల్లి దండ్రుల ఆలోచనతో గాని శాస్త్ర పరిజ్ఞానముతోగాని నీకు నీవుగా గాని శరీరాన్ని ధరించి భూమి మీద బ్రతికి బట్టకట్టలేవన్న సంగతి స్పష్టమే. దేవుడు నిన్ను కావాలనుకున్నాడు, కనుక ఒక వ్యక్తిగా లోకానికి పరిచయమయ్యావే తప్ప లేని యెడల నీవు నిరాకారుడవే. ఏలయనగా నేడు కనబడుచున్న నీ శరీర రూపానికి ముందు తల్లి గర్భములో నీకు ముందుగానే, లేక నీ వెనుకగాని కోట్లాది కణాలు నేల రాలినవని జ్ఞాపకమును తెచ్చుకోవచ్చు. ఆయన ఇష్టము నీ శరీరమునందు నెరవేరునను నమ్మకముతో నిన్ను నమ్మి నీకు శరీరమును అమర్చియున్నాడు. వాటన్నింటినీ వమ్ము చేసి దేవుని వాసమైన మానవ శరీరాన్ని పాప భూయిష్టమై ప్రాపంచిక సుఖాలకు బలిచేస్తే దాని పర్యవసానం ఎంత భయంకరంగా ఉంటుందో ఒకసారి ఆలోచించు.

ఆత్మ చెప్పుచేతల నుండి తప్పిపోయి, శరీర అవయవములన్నియూ మలినమై ఇప్పటికే అనేక శరీరాలు నేటి ప్రపంచములో దుర్నీతి సాధనములుగా మిగిలిపోయాయి. విశ్వకోటిలోని మానవ శరీరాలు దెయ్యాలకు వాసములై దైవత్వాన్ని రూపుమాపాయి. దేవుడుండవలసిన మానవ శరీరములో దెయ్యం స్థానం ఏర్పరచుకొని **- ఏది దేవుడనబడునో, ఏదిపూజింపబడునో దానినంతటినీ ఎదిరించుచూ దానికంతటికీ పైగా దయ్యము తనను తానే హెచ్చించుకొనుచు తానే దేవుడనని కనపరచుకొంటూ దేవునిచే నిర్మింపబడిన మీ శరీర ఆలయంలో కూర్చుండును (2 థెస్స 2:4)** ఇది నేటి ప్రపంచ మనుష్యుల అతి భయంకర దుస్థితి. **అందువలననే అందరునూ తమ సొంత కార్యములనే చూచుకొనుచున్నారు గాని యేసుక్రీస్తు కార్యముల చూడరు (ఫిలిప్పీ 2:21)** శరీర దురాశలకు లోబడి దేవుని సంకల్పాన్ని మరచి, శరీర పుట్టుకవెనుకున్న అంతర్యాన్ని, చరిత్రను మరచి పాపపు ప్రపంచములో మత్తులై నిద్రపోతున్నారు. శరీర కోరికలకు సంకెళ్ళు వేయలేక ఆత్మ ఆవేదనను అర్ధం చేసుకొనక, శరీరానికే బానిసలుగా మారిపోతున్నారు. **- ఆత్మానుసారముగా నడుచుకొనుడి అప్పుడు మీరు శరీరేచ్ఛలను నెరవేర్చరు. శరీరము ఆత్మకును, ఆత్మ శరీరమునకు విరోధముగా అపేక్షించును. ఇవి ఒకదానికొకటి వ్యతిరేకముగా ఉన్నవి. కనుక మీరేమి చేయ నిశ్చయింతురో వాటిని చేయకుందురు. (గలతి 5:16-17).** తన కోపమే తన శత్రువని కవులంటారు. కోపమొక్కటే మానవ శరీరానికి శత్రువని మిగతావన్నీ మిత్రులయినట్లు వారి భావనేమో, శరీరము నుండి పుట్టిన కోపము దానికి హాని చేస్తుందని అర్ధం. శరీరపు లోతులలోనికి వెళితే అదొక భయంకరమైన అగాధము సకల పాపాలకు, పుట్టుకకు కేంద్రమైన వాటిని ఉత్పత్తి చేసే కర్మాగారము, ఏలయనగా - శరీర కార్యములు స్పష్టమైయున్నవి. అవేవనగా, జారత్వము, అపవిత్రత, కాముకత్వము, విగ్రహారాధన, అభిచారము, ద్వేషములు, కలహము, మత్సరములు, క్రోధములు, కక్షలు, బేధములు, విమతములు, అసూయలు, మత్తతలు, అల్లరితోకూడిన ఆటపాటలు మున్నగునవెన్నో అందులోని ఈ అగాధము నుండి ఎన్నెన్నో ఘోర కార్యములు మానవ శరీరము నుండి బయలు వెడలుచున్నవి. తన శరీర పరిస్థితిని క్షుణ్ణంగా ఎరిగిన మానవుడు తనంతటి మంచివాడు లేడని సమర్ధించుకొనును. చేసిన వాటికి చెంపలేసుకొనక, శరీర కార్యాలకు కొత్త వత్తాసు పలుకుతూ పెంచి పోషిస్తున్నాడే గాని, దానిని అదుపుచేయుట లేదు. గంతలు, కళ్ళెము, కంచ, గుఞ్జానికి ఉపయోగిస్తేనేగాని దానినేలాగు స్వాధీన పరచుకోలేమో నీ శరీరము కూడా

అంతే, ప్రపంచంలో ప్రతి మనిషి అన్నింటికంటే ఎక్కువగా ముందు శరీరాన్ని ప్రేమించడం అన్నది నగ్న సత్యం, తరువాతే పదవి, డబ్బు, అంతస్తు మున్నగునవి ప్రపంచ మనస్తత్వ శాస్త్రాన్ని విపులంగ వ్రాసిన విలియమ్ ఊండ్సుకు కూడా ఈ విషయం తెలికపోవడం విచారకరం. - **నా యందు అనగా నా శరీరమందు మంచిదేదియూ నివశింపదని నేనెరుగుదును. మేలయినది చేయవలెనను కోరిక నాకు కలుగుచున్నదిగాని దానిని చేయుట నాకు కలుగుటలేదు. ఎందుకనగా అట్టి భయంకర పాపనియమానికి నా అవయవములే ఉనికి పట్టని నాకు కనపడుచున్నవి. అయ్యో ! నేనెంత దౌర్భాగ్యుడను ఇట్టి మరణమునకు లోనగు నా శరీరము నుండి నన్నెవడు విడిపించును (రోమా 7:18, 19, 21,23,24) మానవులలో యుద్ధములు, పోరాటములు దేనినుండి కలుగుచున్నవి. వారి అవయవములలో పోరాడు భోగేచ్ఛలనుండియే గదా! వారాశించుచున్నారు కాని సంపాదించుకొనలేరు. పోట్లాడుదురు, యుద్ధము చేయుదురు కాని దేవునిని అడుగనందున వారికేమియూ, దొరకదు వారడిగినను శరీర భోగముల నిమిత్తము వినియోగించుటకై దురుద్దేశముతో అడుగుదురు. గనుక వారికేమియూ దొరకదు. (యాకోబు 4:1-3).** ఇట్టి శరీర పరిస్థితిని కలిగిన మానవ జాతి దానిని సజీవముగా దేవునికి అప్పగించగలరా? పాడి, ప్రస్తుతించి, సువార్తను ప్రకటించి, నడతలు, చేతలు, ఆలోచనలు, శరీరములోని అవయవములు వలన జరుగవలసిన తండ్రి పనికి బదులు సాతాను తంత్రాలు కలిగి దయ్యపు పనులు జరిగించుచున్నారు.

ప్రియమైన పాఠక మహాశయా ! దేవుడు కలలుకని ప్రసాదించిన అపూర్వమైన మీ శరీర గాధను చదివిన నీవు నేటి నుండి దానిని నీ తండ్రి సేవకు ఉపయోగించగలవా ? యేసు శరీరమంతా నీకే అప్పగించబడింది. దాని బలియాగమే నీకు, నాకు, సర్వలోకానికి రక్షణ అయ్యింది. పాప క్షమాపణ ఇచ్చింది. తండ్రి తన గ్రంథపు చుట్టలో లికించిన విధంగా ఒక్క యేసు మాత్రమే గాక ఎందరో మహాత్ములు, త్యాగశీలురు, చరిత్రలో మనముందున్నారు. నేను శరీరమునందు నిలిచి ఉండుట మిమ్మునుబట్టి మరి అవసరమైయున్నదని (ఫిలిప్పీ 1 : 24) లో పౌలు పలుకుచున్నాడు. **అలాగే మోషే పెద్దవాడయినపుడు విశ్వాసమును బట్టి ఐగుప్తు ధనము కంటె క్రీస్తు విషయమైన నింద గొప్ప భాగ్యమని ఎంచుకొని శరీరముతో అల్పకాలము పాపభోగము అనుభవించుటకంటే దేవుని ప్రజలతో శ్రమ అనుభవించుట మేలని యోచించి, ఫరో కుమార్తె యొక్క కుమారుడని అనిపించుకొనుటకు మోషే ఒప్పుకొనలేదు. ఏలయనగా, అతడు ప్రతిఫలముగా పరలోకమందు కలుగు బహుమానమందు దృష్టి ఉంచెను. (హెబ్రీ 11:24-260. అశాశ్వత లోక కోరికలకు అమూల్యమైన దానిని మలచి తండ్రి ఇష్టాన్ని జరిగించుము. ఇదిగో - దేవుని నివాసము మనుష్యులలో కూడా ఉన్నది ఆయన వారితో కాపురముండును వారాయన ప్రజలై ఉందురు. దేవుడు తానే వారి దేవుడై యుండి వారికి తోడుగా ఉండును (ప్రకటన 21:3).**

